[illegible] ౫౦౧

శ్రీరామనీస్నామములు.

7177

శ్రీహరి రాఘవేంద్రా - కాకుత్థ్సాన్వయాం
భోధిచంద్రా - కరుణాపయోధే - పారాశర్యాది
గేయా - ఆహల్యామోక్షాదిదీక్షాదిగురూ - హర
కోదండఖండనా - అయోధ్యాపురవిహారా - మారీచ
మాయామృగవేటకాడా - సీతాసమేతా - పుష్ప
కారూఢా - సుగ్రీవరాజ్యస్థాపనాచార్యా - యా
గరక్షణశౌర్యా - పరశురామపరాక్రమభంజనా -
నిగమగోచరా - నిత్యనిరంజనా - పరమకల్యాణగు
ణాకరా - పరవస్తుస్వరూపా - యఖిలాండకోటిబ్ర
హ్మాండకుటుంబా - తేజోజితానంతకోటిభాస్కరబిం
బా - యాదిమధ్యాంతరహితా - యనంతావతారా -
యనంతావతారనిర్మితా - దేవాదిదేవోత్తమా - దేవతా
సార్వభౌమా - కరుణాకటాక్షవీక్షణా - సుఖసుధా
కరా - సంపూర్ణకామచంద్రోదయా - కోదండ
దీక్షాగురూపాకౌసల్యాగర్భరత్నాకరా సమస్తక
ల్యాణగుణాకరా - పరమస్వరూపాయనంతదేవేశా
యాదికారణా - జగన్నాథా - లక్ష్మీనివాసా శేష

చలనివాసా - వైకుంఠవాసా - సర్వభూత దయానివాసా - శ్రీనివాసా - జగన్నాథా లోకనాథా - రఘుకులోత్తమా - రమాకాంతా మనోహరా - సర్వభూతాంతర్యామీ - నీమహాచరిత్రంబులు బ్రహ్మాదులకొనియాడ తేరు - ప్రాకృతమాత్రుండగు పాతకుండనేను - నీచమతిని - దుర్బుద్ధిని - దురహంకారుండను దుర్వివేకుండను - మందబుద్ధిని - నీ దివ్యావతారంబులు - నీగుణంబులు నే గొనియాడ నేనెంతటివాడ ॥

నీవిశ్వరూపంబర్జునుండెరుంగు - నీకటాక్షంబు కుచేలుండెరుంగు - నీకరుణారసంబు పాంచాలీదేవియెరుంగు - నీభక్తసంరక్షణగజేంద్రుండెరుంగు - నీమాహాత్మ్యంబుయశోదాదేవియెరుంగు నీదృఢబలంబు మందరగిరియెరుంగు నీశరలాఘవంబురావణుండెరుంగు - నీసత్యవ్రతంబు సీతాదేవియెరుంగు - నీశుభమహాంతంబులు సౌమిత్రియెరుంగు నీపాదమాహాత్మ్యంబహల్యాదేవియెరుంగు - నీజారచోరత్వంబులుగోపికలెరుంగుదురు నీగుణమాహాత్మ్యంబుబ్రహ్మాదులెరుంగుదురు నీనటనవిచిత్రంబులుకాళింగుడెరుంగు - నీనామమాహాత్మ్యపుస్వాదుపార్వతీ దే

వియెఱుంగు - నీగుణవిశేషపరిభావంబులయ్యుష ప్రం
డెఱుంగు - నీలీలావినోదంబులకూర్మం డెఱుంగు -
నీయద్భుతకల్యాణగుణంబులు బకదాల్భ్యముని ఎ
ఱుంగు - నీయనంతకల్యాణగుణంబుల పరిభావంబు
నిజభక్తుండైన హంసధ్వజుం డెఱుంగు - నీపరమభక్తు
లకటాక్షించు విశేషంబులు సుధన్వుం డెఱుంగు - నీపు
శావతారగుణవిశేష పరిభావంబులు శ్రీసాంబశివుం
డెఱుంగు - నీమాయావిచిత్రంబులు నారదుం డెఱుం
గు - నీదివ్యమంగళవిగ్రహసౌందర్యంబు గోపికాస్త్రీ
లెఱుంగుదురు - నీధైర్య సాహసపరాక్రమంబులు -
ఖరదూషణత్రిశిరాదిమహాశూరు లెఱుంగుదురు - నీ
మౌనవ్రతశాంతత వ్రసత్యవ్రతనియమవిశేషంబులు
బ్రహ్మర్షు లెఱుంగుదురు - నీచాతుర్యసౌందర్యగాంభీ
ర్యాద్భుతపరాక్రమసత్యంబులు నీదృఢభక్తుండైన
మయూరధ్వజుం డెఱుంగు -

దేవాదిదేవోత్తమా - శరణంటి - నీవాడనంటి
రక్షించుమంటి - దరిజేర్చుమంటి - మన్నించుమంటి
కరుణించుమంటి - కడతేర్చుమంటి - కాపాడుమం
టి - ఓమహాప్రభో - శరణాగతరక్షణబిరుదుగలతం

ర్వంబునుసమష్టియంటే సృష్టిరూపంబులోక ప్రతినిజం
బంటే - సత్యమంటే - శక్తిరూపమంటే - కారణమంటే
సాలోక్యమంటే - సామీప్యమంటే - సారూప్యమం
టే - సాయుజ్యమంటే - సాక్షిత్వమంటే - విలక్షణ
త్వమంటే - నమ్మితిని నమ్మితిని, రక్షించు రక్షించు ॥

ఓకమలాక్షా - పుండరీకాక్షా - యోపురాణపు
రుషోత్తమా - యోపుణ్యసంకీర్తనా - యోఅఖండ
సచ్చిదానందగురూ - యోసమస్తకల్యాణ గుణాక
రా - యోపరమస్వరూపా - సకలలోకావనదయా
నిధే - వాసుదేవా - మహాప్రభో వేద వేదాంత వేద్యా
యోయప్రమేయవరదా - ఓనీలమేఘశ్యామా - ఓ
సర్వభూతాంతర్యామి - భక్తమందారా - భక్త
చింతామణీ భక్తరక్షామణీ తాటకీప్రాణాపహారా రా
క్షసకులాంతకా రఘువంశతిలకా వార్ధిగర్వభంజ
నామారీచసంహారా మహనీయరూపా, మంజుకలా
పా - గజేంద్రవరదా - ప్రహ్లాదవరదా - నారదవర
దా - యంబరీషవరదా - రుక్మాంగదవరదా - ముచు
కుందవరదా - మైత్రేయవరదా - యక్రూరవరదా
విదురవరదా - పాండవవరదా - కపిలఋషివరదా -

కుచేలవరదా - అంగీరసవరదా - శ్రుతిదేవవరదా - రంతిదేవవరదా - హరిశ్చంద్రవరదా - స్వాయంభువవరదా - ప్రాచీనబర్హిఃవరదా - ప్రచేతసవరదా పృథురాజవరదా - తామ్రధ్వజరాజవరదా - హంసధ్వజవరదా - సుధన్వవరదా - సురతవరదా - శ్రుతధన్వవరదా - పుండరీకవరదా - జాకపాల్యకవరదా - తాపసవరదా - దత్తాత్రేయవరదా - జమదగ్నివరదా - ద్రుపదరాజవరదా - పరాశరవ్యాసశుక కపిలవరదా - సనకసనందనాదివరదా - ద్రౌపదీమానసంరక్షకా - ధర్మపరిపాలనా - విభీషణరాజ్యస్థాపనాచార్యా - కబంధమోక్షణా - కంసశిక్షణా వాలిమర్దనా - కాకాసురశిక్షణా - జటాయుమోక్షణా - సాగరగర్వభంజనా - ఖరదూషణత్రిశిరశిక్షణా - అతికాయమహాకాయధూమ్రాక్ష - విరూపాక్షమర్దనా - కుంభనికుంభశిక్షణా - రావణకుంభకర్ణాదిమహాయోధసంహారకా - పాండవరక్షణా ఫణిపతిశయనా - పంకజనాభా - పాపవిదూరా - పరాపరాక్షరా - పరమపావనా - పరమేశనుతా - పరమపురుషా - హరీ - పరమాత్మా - శ్రీమత్తార

కా - పరమప్రకాశా - పరిపూర్ణప్రకాశా - పరంజ్యో
తిస్స్వరూపా - పరమానందరూపా - పరమహంసా -
నిర్విషయానందా - నిరుపమరూపా - నిరాధారా -
నిర్గుణరూపా - నిర్వికల్పా - నిత్యపరిపూర్ణా - నీల
తోయదగాత్రా - నిరతా - నిర్మలా - నిరాహారా -
నిశ్చింతా - కమలలోచనా - కమలాభరణా - కర్త
వ్యావతారా - కామితఫలప్రదాయకా - కౌస్తుభా
భరణా - కమనీయరూపా - కమలామనోహరా -
కమలసంభవవినుతా - గరుడగమనా - గరుడధ్వజ
- గాయత్రీస్వరూపా - దానవినోదా - గౌరీవిను
తా - గంగాజనకా - గాండీవినుతా - ఘనపరాక్ర
మా - చతుర్భుజరూపా - చారుశరీరా - చక్రాయు
ధధరా, చతుర్ముఖజనకా, చంద్రజూటవినుతా,
చారుతరవదనా, చాణూరముష్టికాసుర సంహారా,
శౌర్యచాతుర్యా, జలజాక్షా, జగద్రక్షకా, జానకీ
ప్రాణరక్షా, జగదీశ్వరా, జలధిశాయీ, జగదుద్ధా
రకా, జనార్దనా, జగన్నాదా, జంగమాత్మకా, జ
గన్నాటకసూత్రధారీ, తారహారకా, తత్త్వజ్ఞా
నిధీ, తామసగుణచ్ఛేదనా, తరణివంశప్రతిపాలనా,

తాళభంజనపరాక్రమా తారాసుతసుగ్రీవాదితరు
చరసేనా ప్రముఖసేవితా, వాసవసింభాపనకుమా
రా, ధనుర్విద్యాప్రవీణా, దశావతారా, నందకుమా
రకా, నవనీతచోరా, సవ్యాశరీరా' నవరసపూరా,
నరకాసురహారా, మురాసురశిరచ్ఛేదనా, త్రిపురా
సురసంహారకా, నరభోజనకంటకరూపా, నవ్యాక
లాపా, నారాయణాఖ్యా, నందగోకులా, నందనా
యకా, నందసంభూతా, యానందసాగరా, నంద
గానముకుందా' నందమురహారా, నందతపఃఫలదా
యకా' నందయశోదా, నందసుధానిధే, బలరామా
నుజా' బాలగోపాలా, బకబంధనా, భీష్మముక్తిప్రదా
యకా, భీష్మకసుతామహోల్లాసా, భీకరదనుజాం
తకా; భీకరఫణిమర్దనా, యాదవకులసార్వభౌమా
యమళార్జునవిదారా, యోగనిద్రానిమీలితలోచ
నా, యాగసంరక్షణోద్ధారకా, యువపద్మాంకుశపా
దరేఖా, భూషితమహిళా; యవనజరాసంధాది మ
హాదుర్జనసంహారకా, యేకాంతప్రకాశా, జగచ్చ
క్షుప్రకాశా, రాకాచంద్రమండలసదృశవదనబిం
బా, రాగాదిశూన్యా, రవిశశినయనా' రాజితర

త్న కాంతియుతా, మకరకుండలకిరీటాది భూషణా, నీలమేఘశ్యామా, దివ్యమంగళవిగ్రహా దివ్యపీతాంబరధరా, శోభాయమానా, నవరత్న కిరీటకేయూరాద్యలంకార ప్రకాశమానా, అస్ఖలిత బ్రహ్మచారీ - శంఖచక్రగదాద్యాయుధా, భాస్వత్తేజో విరాజమానా, నవరత్న స్థగిత దివ్యభూషణాలంకారకోటికోట్యర్క ప్రభాభాసమానా, తేజోవిరాజా, రామకథామృతసాగరా, చపలమారీచమర్దనా, శోభితాకారా, రమణీయమనోరథా, సీతాసమేతా, పుష్పకారూఢా, లావణ్యగుణసాగరా, లక్ష్మణాగ్రజా - నూతనమదనకోటిలావణ్యా, లక్ష్మీవక్షస్థల విరాజమానా, సకలలోకదయాపరిపూర్ణా, అఖండతేజోనిధీ, పరమాత్మా, యంతరాత్మా, నిర్మలాత్మా, శుద్ధాత్మా, ఆపోనారాయణా, వారణాభయప్రధానా, కరుణాకటాక్షవీక్షణా, సుధారససంపూర్ణా, కామచంద్రోదయా, కోదండదీక్షాదిగురూ, కౌసల్యాగర్భరత్నాకరా, సమస్తకల్యాణగుణనిధీ, పుణ్యసంకీర్తనా, శ్రీ వేదవేదాంతవేద్యా, సర్వభూతదయాసాంద్రా, సర్వభూతాంతర్యామీ, సర్వసాక్షీ, ఆ

త్రరక్షకా, యఖండరక్షకా, యనంతరక్షకా, దీన
పోషకా, సాధుసంరక్షణా, భక్తపోషణా, దివ్యా
యుధధరా, దివ్యమాల్యా, దివ్యపోషణా, సర్వేశా
పరమేశ్వరా, జనార్దనా, ఉపేంద్రమూర్తీ, కాల
మూర్తీ, లోకనాథమాధవా, గోవర్ధనోద్ధారకా,
గోపీజనమనోహరకా, గోపాలబాలసంరక్షణా, కా
ళింగమర్దనా, పూతనాప్రాణాపహారకా, శకటాసు
రభంజనా, తృణావర్తసంహారకా, ఘటికాసురభం
జనా, నలకూబరమణిగ్రీవశాపవిమోచనా, వంశర
వామృతా, కర్ణవధానజనకా, గోపసుందరీమనో
ల్లాసా, వాయుపుత్రితరుచరసేనా, ప్రముఖసేవితా
భక్తచకోరకా, శమదమశాంతాదిగుణ కీర్తిదాకార
ణా, పరమపురుషనిధానా, కోటిసూర్యప్రభాభాస
మానా, దీనదయాపరమూర్తీ, లక్ష్మీకాంతా, మనో
హరా, సకలలోకదయాపరమూర్తీ, సకలజీవద
యాపరమూర్తీ, సేతుబంధనా, మూలబలోత్పాట
నా, విశ్వేశ్వరా, విశ్వవ్యాపకా, విశ్వాత్మా, విశ్వసం
వేద్యా, విశ్వంభరా, విశ్వాంతర్వ్యాపకా, విశ్వభా
వనా, విశ్వాతీతా, శమదమశాంతాదిగుణ ప్రవీణకా

రకా, మాంరక్ష, సాకేతాధిప సర్వలోక శరణ్యా, మాంరక్ష, సత్రాజిత్తనయామనోల్లాస, భాసురప్రకాశా, మాంరక్ష, భీష్మభూపాలవరపుత్రీరుక్మిణీప్రాణవల్లభా, మాంరక్ష, జాంబవతీమనోవల్లభా, భాసురప్రకాశా, మాంరక్ష, మిత్రవిందానుతహాలాయమానా, మాంరక్ష, కాళిందీనాగ్నజితీభద్రలక్షణామనోప్రాణవల్లభా, మాంరక్ష, షోడశసహస్రదివ్యవధూలలామా, మాంరక్ష, చంద్రరుద్రహైమవతీకుబేరవృషభగాలవశాండిల్యపాశుపతజటీపటలమండితశోభాయమానా, మాంరక్ష, మాధవ, ముఖ్యరూపమహితా, బ్రహ్మగేహంబున శాపదాన్వితంబయి నీలగళసభానికేతనంబయి మనోహరంబయిన మూర్తి, విభ్రాజమానా, మాంరక్ష, మహోన్నతశల్యాపహారకారంబయినసముద్రసేతుబంధనంబువలన నీలవనసాది ప్రదీపితంబయి భర్గధనుర్భంజనంబున మహాశాఖాచతుష్టయోపమానంబయి మెరయు కోదండప్రచండబాహుదండా, మాంరక్ష, మునిగణసన్నుతచరిత్రా, మాంరక్ష, సకలమునిహృదయాంతరాళా, చిత్రాకారా, మాంరక్ష,

పరంజ్యోతి స్వరూపా, మాంరక్ష, సగుణనిర్గుణ తారక బ్రహ్మావతారా, మాంరక్ష, సనకసనందన స సత్కుమారసనత్సుజాతార్చిత పాదపద్మయుగళా, మాంరక్ష, శరణాగతవజ్రపరంపరబిరుదాంకిత,హా రిగోవింద' మాంరక్ష' వందారుబృందహృదయార విందమరందబిందుసందోహ స్వాదనేందిందిరా' మాంరక్ష' ఉత్తుంగభృంగతరంగ శ్రీకరాకారా. విశ్వగుణకీర్తికలాపా' మాంరక్ష,ప్రహ్లాదనారదపరా శర పుండరీక వ్యాసాంబరీష శుకశౌనక, సూతమై త్రేయభృగు గాంగేయ గౌతమ జమదగ్ని జాబా లికశ్యప శ్రుతదేవమార్కండేయ చ్యవన మారీ చాంగీరస ప్రముఖ నిర్మలాంతఃకరణ సేవిత విరాజ మానా మాంరక్ష, స్థూలసూక్ష్మకారణ మహాకారణ బిందుకోశనిధే, నాథజేగీయమానా, మాంరక్ష, కో టికోట్యర్క ప్రభాభాసమానా, మాంరక్ష. రక్ష సద్గురుసచ్చిదానందగురు భోదానందగురు పతితు లరక్షించుట మీ పతితపావనబిరుదు కొందరుమో గంబులని, కొందరుభోగంబులని, కొందరొహాసం బులని, కొందరుపవాసంబులని, కొందరునేమంబుల

ని, కొందరాసనంబులని, కొందరు స్నానంబులని, కొందరుదానంబులని, కొందరువ్రతంబులని, కొందరుస్వధర్మంబులని,కొందరాశ్రమంబులనికొందరు వేదంబులనికొందరుశాస్త్రంబులనికొందరుమహాభాగీరథీముఖ్యాదిమహాతీర్థయాత్రంబులని, కొందరు హఠయోగంబులని కొందరు సాంఖ్యయోగంబులనికొందరుభక్తియోగంబులని, కొందరు రాజయోగంబులని కొందరు జ్ఞానయోగంబులని కొందరుమంత్ర యోగంబులని కొందరు లయ యోగంబులని, కొందరుసాష్టాంగ యోగంబులని కొందరు తారకామనస్కంబులని కొందరుప్రాణాయామప్రత్యాహారధ్యాన ధారణ సమాధులని కొందరు శ్రీభాగవత పురాణాదిమహాపుణ్యచరిత్రంబులని నానావిధమార్గంబుల మీ పాదారవిందంబులంబొందెదమని ప్రయత్నంబు సేయుచున్న వారమయ్యా.

మహాప్రభో ।పుండరీకాక్షా ।కమలాక్షా। యోవరదా ।యోనీలమేఘశ్యామశంఖచక్రగదాశార్ఙ్గకోదండ ధనుర్ధరణతేజోవిరాజమానా పుణ్యసంకీర్తనా। పతితపావనా । భక్తవత్సలబిరుదాంకితా

ది స్వాహాకారా। అఖండస్సచ్చిదానందపరమాబదము తిసయనసేసు వేదంబులెరుంగ శాస్త్రంబులెరుంగ తపంబులెరుంగ దానంబులెరుంగ ధర్మంబులెరుంగనాశ్రమంబులెరుంగనష్టాంగ యోగంబు లెరుంగ భక్తిజ్ఞానయోగంబులెరుంగ రాజయోగంబులెరుంగ వాదంబులెరుంగ భేదంబులెరుంగమందమతి నిమూఢుండను పతితుండను పామరుండ నశక్తుండను బాపకర్ముండ నాచారహీనుండనువిషయాసక్తుండనుసర్వదాపరనిందకుండను అప్రియలోలుండను మహాకపటకూటకుండను కుటిలస్వభావుండను కామక్రోధలోభమదమత్సరుండను అజ్ఞానుండను సర్వలోలుకుండను సర్వదాపరనిందాపమానకుతూహలుండను మలినచిత్తుండను అల్పాయుష్యకార్యదుర్మార్గుండనుమిథ్యాభూతుండనుబూటకుండను నైనన న్నురక్షింప సమర్థులెవ్వరని న్యాసంచితఫలంబున। నరకంబున। యాతనాతనుండై। (అన్యథాశరణంనాస్తి త్వమేవ శరణంమమ। తస్మాత్కారుణ్యభావేన రక్షరక్ష జనార్దన ॥) యని - గజేంద్ర వరదుండవని నేమింపాదార విందంబులుగ

ట్టిగా హృదయాంతరాళంబులో । సప్తదళపదంబున । నవవర్ణంబైన । బిందునాద కళాతీతమైన । యాధార । స్వాధిష్ఠాన । మణిపూరక । అనాహత విశుద్ధ । ఆజ్ఞేయ । సహస్రదళమధ్యా । ఆపోజ్యోతి స్వరూపమైన । పరబ్రహ్మంబును । ఇడాపింగళామధ్యే । సుషుమ్నా మార్గే । నిటుపరబ్రహ్మంబును । దివ్యచక్షుస్సునెఱింగి చూచినిశ్చయించి । హృత్పద్మాసనునిగా దయచేయుము । అనివేడుకొనగా । సహస్రదళ కమలంబున । సహస్రాసన గోచరంబైన నీకుశమదమంబులను । యఖిషేకకంబు చేసి । ప్రాణ పంచక మహానైవేద్యంబు సమర్పించి జ్ఞానేంద్రియములనే దివ్యగంధ మాల్యాదులొసంగి యరిషడ్వర్గంబులనునీకు నామోచ్చారణంబుగా సమర్పించి మనస్సు నీరాజనంబుగా సమర్పించిబుద్ధిజ్ఞాన శాంతంబులనే షోడశోపచారంబులు సమర్పించి భక్తిశుద్ధనిశ్చితంబున ప్రి

దక్షిణ నమస్కారంబులు జేసి రక్షించు రక్షించు
మనినీమరుగుజొచ్చి నాడను. శ్రీహరిరాఘవేంద్రా
శ్రీరామచంద్రానమస్తే నమస్తే నమః.

శ్రీరామ విన్నపములు.

సంపూర్ణము.



శ్రీ వేంకటకృష్ణ విద్యానాగర ముద్రాక్షరశాల కాకినాడ.